# విద్యార్థీ నీ గమ్యమేది ?




mohan
PUBLICATIONS
Mohanpublication.com
Granthanidhi.blogspot.in





మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533 101.
Granthanidhi.blogspot.in

# విద్యార్థీ నీ గమ్యమేది?

జూలై 1985

వెల : 1-50

ముద్రణ :
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్
హైదర్‌గూడ,
హైదరాబాద్ - 500 029

ప్రతులకు :
సాహిత్య నికేతన్
బర్కత్‌పురా,
హైదరాబాద్ - 500 027

సాహిత్య నికేతన్
ఏలూరు రోడ్డు,
విజయవాడ - 2

నవభారతి ప్రచురణలు
3-4-705/4, నారాయణగూడ,
హైదరాబాద్ - 500 029

# ఈ పుస్తకంలో

నేటి యువత గమ్యం తెలియక బాధపడ్తున్నారని, అందువలననే అనేక మానసిక సంఘర్షణలకు లోనవుతున్నారని పలువురి మేధావుల అభిప్రాయం. ప్రాంగణ అశాంతి, ప్రాంగణాలలో మత్తుమందుల వాడకం **(Campus unrest and drug addiction)** పెరుగుతున్నాయని కూడ బాధపడ్తున్నారు. మరొకప్రక్క విద్యార్థులలోని మానసిక ఆందోళనను ఆధారం చేసుకుని, వారిని తీవ్రవాదులుగా, హింసావాదులుగా మార్చే ప్రయత్నాలు జరుగుతున్నాయి.

ఈ సంక్లిష్ట పరిస్థితులలో వారికి చక్కటి మార్గ దర్శనం అవసరం. వారిముందు ఒక లక్ష్యాన్ని ఉంచటం, తద్వారా వారిని ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దటం మనందరి కర్తవ్యం.

అంతర్జాతీయ యువజన సంవత్సరం శ్రీ హెచ్. వి. శేషాద్రి ఉస్మానియా విశ్వవిద్యాలయ ప్రాంగణ సైన్స్ కళాశాల విద్యార్థుల నుద్దేశించి చేసిన ప్రసంగాన్ని ప్రచురించటానికి అనుమతించినందుకు వారికి మా కృతజ్ఞతాపూర్వక వందనాలు. తెలుగులో అనువదించి యిచ్చిన శ్రీ స్వాతికి మా ధన్యవాదాలు.

హైదరాబాదు ప్రకాశకులు

జీవితంలో శ్రేష్ఠమైన సమయమేది?

విద్యార్థిదశ అన్నిటికంటే ఉత్తమమైంది. జీవితంలో చాలా శ్రేష్ఠమైన కాలమిది. సద్వినియోగపరుచుకుంటే తర్వాతి జీవితం ఎంతో ఆదర్శ ప్రాయంగా ఉంటుంది. సమగ్రమైన జీవితాదర్శాలు లేకుండా కాలక్షేపం చేసినా, చెడు పంథాలో ప్రయాణం మొదలుపెట్టినా భవిష్యత్తులో విచారిం చాల్సివస్తుంది.

శ్రేష్ఠమైన కాలం అనే దానికి నిర్వచనం ఒక్కొక్కరి ఆలోచనలో ఒక్కోవిధంగా ఉంటుంది. అది సహజమే కదా! 'జీవన సంగ్రామంలో ముందు ముందు ఎలాగూ బాధలు తప్పవు. జల్సాగా కాలక్షేపం చేసేయ్ తమ్ముడూ!' అనే తత్వంవాళ్ళు చాలా మంది దొరుకుతారు మనకు. ఇలా ఎన్నో రకాల నిర్వచనాలుంటాయి. కాని 'శ్రేష్ఠమైనకాలం' అనేదానికి సరియైన భాష్యం చెప్పినవాడు సర్ విన్‌స్టన్ చర్చిల్.

అవి రెండో ప్రపంచ యుద్ధం రోజులు. జర్మనీ అన్ని యితర ఐరోపా దేశాలమీద యుద్ధం కొనసాగిస్తున్నది. ఇంగ్లాండు మీద దాడి ఉధృతం చేసింది. ఆ రోజుల్లో ఇంగ్లాండు పెద్ద సామ్రాజ్యాధినేత. పెద్ద రాజును కొడితే అతని పాలనలో ఉన్న రాజ్యాలన్నీ తనవే గదా? అదీ జర్మనీ ఉద్దేశ్యం. పెద్దరాజుగారి ముఖ్యపట్టణం లండన్‌మీద సాగుతోంది దాడి. జర్మన్ విమానాలు అహర్నిశలూ గుంపులు గుంపులుగా, తెరలు తెరలుగా వచ్చి బాంబులు వేసిపోతున్నాయి. సాంకేతికంగా అంతగా

ముందడుగు వెయ్యని ఇంగ్లాండ్ బాంబులు వేస్తున్న శత్రు విమానాలను కూల్చలేకపోతోంది. పెద్ద పెద్ద భవనాలు పేకమేడల్లా కూలిపోతున్నాయ్. కర్మాగారాలు నేలమట్టం అవుతున్నవి. పది వేల మందికిపైగా పిల్లల్ని భద్రత దృష్ట్యా లండన్ నగరాన్నుంచి తరలించారు. ఏ క్షణాన ఎవరికి మూడుతుందో తెలీదు.

యుద్ధ సమయంలో నిత్యావసర వస్తువులతోసహా ఎన్నో రకాల యంత్ర సామగ్రి అవసరమూ విపరీతంగా పెరిగిపోయింది. కూలిపోయిన కర్మాగారాలు చేసే ఉత్పత్తి కూడా మిగిలిన కర్మాగారాలు చెయ్యాలి. యుద్ధ సామగ్రిని సైనికులకు అందించే కర్మాగారాలు అహర్నిశలూ పని చేయకతప్పదు. కార్మికులంతా దినానికి 16 గంటలు పనిచేస్తున్నారు. 'దేశం ప్రమాదంలో ఉంది. రక్షించుకోవాలి' ఇదే ధ్యాస! దినాలు గడిచే కొద్దీ కార్మికుల శక్తి క్షీణిస్తున్నది. పోషణ తగ్గటం, పని హెచ్చటం. కొందరు బలహీనమైన కార్మికులు పనిచేస్తూ చేస్తూనే స్పృహతప్పి పడిపో తున్నారు. వాళ్ళ స్థానంలో మరొకరు నిలబడుతున్నారు.

అనిశ్చితకాలం. భార్యలకు ఇంట్లో ఆతృత, బయటకు వెళ్ళిన భర్తలు తిరిగి వస్తారో రారో? భర్తలకు భయం, తామింటికి వెళ్ళేసరికి ఇల్లు ఇల్లాలు క్షేమమో కాదో?? ఎటువంటి దృశ్యం చూడవలసి వస్తుందో?! ఇదీ ఆనాటి పరిస్థితి. చమటోడ్చి కష్టించి, రక్తాన్ని ధారపోసే రోజులు. భయంకర యుద్ధదినాలు.

యుద్ధం ముగిసింది. జర్మనీ ఓడింది. కష్ట సమయంలో దేశాన్ని సమర్థవంతంగా నడిపించిన ప్రధాన మంత్రి సర్ విన్‌స్టన్ చర్చిల్ !

ఆ నాటి భయంకర దినాలను జ్ఞప్తికి తెస్తూ ఆయన ఓ పుస్తకం వ్రాశాడు. దాని పేరు 'యుద్ధ జ్ఞాపకాలు (The War Memoires)'.

అందులో ఒక సంపుటాన్ని పూర్తిగా యుద్ధకాలం నాటి కష్టాల గాధలకే అంకితం చేశాడు. అదో పెద్ద కథ ! రక్తధారల, కన్నీటి ప్రవాహాల నిరంతర పరిశ్రమల గాధా మాలిక. ఆ నిబంధనకు తగిన పేరే ముంటుంది? 'చావు బ్రతుకుల సందిగ్ధం' 'కష్టభరిత సమయం' రక్తతర్పణం'...ఇలాంటి పేర్లు అతికినట్లు సరిగ్గా సరిపోతాయి. కాని మేధావి చర్చిల్ ఆ పేర్లేవీ పెట్టలేదు.

'ఇంగ్లాండుకు శ్రేష్టమైన కాలం' అని పేరు పెట్టాడు !!

ఎంత గొప్ప ఆలోచనో చూడండి ! చావు బ్రతులకు మధ్య ఊగిసలాడుతూ, రాత్రింబవళ్ళు అనిశ్చితతో కొట్టుమిట్టాడుతూ, పసిపిల్లల్ని కూడా క్షేమం దృష్ట్యా వాళ్ళ తల్లిదండ్రుల మధ్య వుండనివ్వకుండా ఎక్కడికో తీసుక వెళ్ళి దాచిన సమయం. ఇదా శ్రేష్ఠమైన కాలం! ? అవును! ఆ దినాలకు అంత చక్కటి పేరు పెట్టం ఒక్క చర్చిల్‌కే తగింది.

ఆ దుర్భర భయంకర రోజుల్లో, అన్చిత సమయంలోనే ఇంగ్లండు ప్రజల అసలు గుణాలు బయటపడ్డాయ్. వాళ్ల అనుశాసనం, ఆదర్శం, స్వేచ్ఛ కోసం చేసిన పోరాటం వీటన్నిటినీ ప్రపంచానికి చాటి చెప్పిన సమయం. ఎంత శ్రేష్ఠమైన కాలమో ఇంగ్లాండు చరిత్రలో !

చాలా సుఖమయ జీవితాన్ని గడిపిన కాలం ఎన్నటికీ శ్రేష్ఠమైన కాలం కాజాలదు. పేరుకొసన పది డిగ్రీలు తగిలించుకున్న కాలంగాదు.

జీవన విలువలు 'డబ్బు సంపాదన' అనే పరిధుల్ని దాటిపోవాలి. అసలైన విలువలు అధికార వ్యామోహపు పంథాలో నడవవు. అత్యున్నత స్థాయిలో వుంటాయి. విద్య అనేది విజ్ఞాన పరిధినేకాక సౌశీల్యాన్ని పెంచేదిగా కూడా వుండాలి. నిజమైన చదువుకు ఈ రెండూ రెండు కళ్ళలాంటివి. ఇవి సాధించిన కాలమే శ్రేష్ఠమైన కాలం ! ఇవి సాధించే కృషి చేసినవాడే నిజమైన పురుష పుంగవుడు.

పురుష పుంగవులంటె ఎవరు ?

ఈనాడు మనచుట్టూ ఎన్నో వికృతులు, ప్రలోభాలు విలయ తాండవం చేస్తున్నాయి ఎన్నో ఆకర్షణలు ఒకవైపుంటే. ఎనలేని సంకట పరిస్థితులు దేశాన్ని అల్లకల్లోలం చేస్తున్నాయి. గురూజీ గోల్వాల్కర్ అనేవారు.

"కొంతమంది అధికారం, ధనసమృద్ధి ఉన్నచోట జన్మించటం చాలా అదృష్టంగా భావిస్తారు. ఇలా భావించేవాళ్ళు మనదేశంలో, మనమధ్యే చాలామంది ఉన్నారు. అలాంటివాళ్ళంతా దేశాన్ని వదిలి, అమెరికా, ఇంగ్లాండు, అరేబియాలాంటి దేశాలకు అక్కడి డబ్బునుచూచి, సమృద్ధికి, విలాసాలకు ప్రలోభపడి వెళ్ళిపోతారు. కాని కొద్దిమంది ఆదర్శవీరులు మాత్రం ప్రస్తుత సందిగ్ధ, సంకట సమయంలో ఈ దేశంలో జన్మించి నందుకు అదృష్టవంతులుగా భావిస్తారు. ఇక్కడి కష్టాలను, లేమిని, బాధలను, వ్యతిరేక పరిస్థితులను ఎదుర్కొని ప్రగతిని సాధించే పోరాటంలో అదృష్టాన్ని చూడగలుగుతారు.

సమృద్ధి నాలుగు చెరగులా వున్నచోట జన్మించిన వాళ్ళకు పెద్ద ఆదర్శమేముంటుంది ? వారి జీవితాలకు చెప్పుకోతగ్గ ఆదర్శమేముండ గలదు? పుడతారు, అన్ని విలాసాలకు, అలవాట్లకు బానిసలై కొన్నాళ్ళు బ్రతుకుతారు, తర్వాత రాలిపోతారు. మరో లక్ష్యమేమిటి ?

వ్యతిరేకత హిమాలయాల్లా అడ్డు నిలిచి సవాలుచేసే పరిస్థితుల్లోనే వ్యక్తిలోని గొప్పతనం, సామర్థ్యం బయట పడతాయి. దేశం మీద ప్రేమను, భక్తి శ్రద్ధలను, తన శక్తిని చూపించుకునే అవకాశం లభిస్తుంది. ప్రపంచం ముందు ఛాతీ విరుచుకుని తన మగతనాన్ని నిరూపించుకుని విరాట్ స్వరూ

పాన్ని చూపగలిగే అవకాశాన్ని పొందగలుగుతారు. మానవుడు ఊహించని ఎత్తులకు సైతం ఎదగటానికి వీలైనన్ని అవకాశాలు మన ముందు నిలుస్తాయి.

ఈనాడు మన తల్లికి కావలసింది మేధావులు, ధీర వీర శూర కిశోరాలు. అలాంటి వాళ్ళే చరిత్రను సృష్టించగలరు. వీరే అసలు పురుష సింహాలు''.

గురూజీ ఈ మాటలు అని చాలా సంవత్సరాలు దాటిపోయినా పరిస్థితుల్లో మార్పులేదు. ఈనాడూ అవి సత్యాలే! ఈ శ్రేష్ఠమైన విద్యార్థి జీవితంలో అలా పురుష సింహాలు కావటానికే ప్రతి విద్యార్థి ప్రయత్నించాలి.

## అసలు చదువెందుకు?

ఈనాటి చదువుల ధ్యేయం కేవలం ఉద్యోగార్జనే అయికూర్చుంది. బ్రిటిష్ వాళ్ళు తమ 150 సంవత్సరాల పరిపాలనానంతరం మనకు వదిలిపోయిన వారసత్వం యిది. అసలైన విద్యయొక్క ధ్యేయం మనస్సును, మేధస్సును, హృదయాన్ని ఉన్నతస్థాయికి తీసుకవెళ్ళేదిలా వుండాలి. కేవలం నాలుగురాళ్ళు సంపాదించిపెట్టేదిలా కాదు. ఈనాటి యువజనం కోరికలు చాలా విచిత్రంగా వుంటున్నాయి. తేలిగ్గా, ఏ మాత్రం కష్టపడకుండా డిగ్రీలు కావాలి అటు తర్వాత సునాయాసంగా పెద్ద జీతాలొచ్చే ఉద్యోగాలు కావాలి కాని, ఈ విషయంలో కుర్రాళ్ళదే తప్పని అనలేం. వాళ్ళకు లభించిన మార్గదర్శనం అలాంటిది మరి! నిజం ఒప్పుకోవాలంటే పెద్ద వాళ్ళదే తప్పు. సరియైన దృక్పథాన్ని, జీవన ధ్యేయాన్ని కలిగించే వారు కరువయ్యారు.

ఓసారి రైలు ప్రయాణంలో ఓ కుర్రాడు కలిశాడు. అతను ఇంటర్మీడియట్ చదువుతున్నాడు. అతనితో సంభాషణ ఇలా సాగింది.

'నీవు ఏ గ్రూపు తీసుకున్నావు బాబూ?'

'M.P.C.'

'ఎందుకు?'

'ఇంజనీరింగ్ చదవటానికి'

'ఎందుకు?'

'ఎందుకేమిటండీ. ఇంజనీరింగ్ సీటొస్తుంది. మంచి ఉద్యోగం వస్తుంది.'

'ఎందుకు?'

బహుశ అతనికి అడిగేవ్యక్తి తెలివితేటల మీద అపనమ్మకం కలిగి వుంటుంది. విచిత్రంగా ఓ సారి చూచి ఇలా జవాబిచ్చాడు.

'ఇంజనీరయితే చాలా డబ్బు సంపాదన వుంటుంది.'

'ఎందుకు?' మళ్ళీ అదే ప్రశ్న.

అప్పుడతనికి పూర్తి నమ్మకం ఏర్పడింది. ఇవతలి వాడు తప్ప కుండా ఏ పిచ్చాసుపత్రి నుంచో పారిపోయివచ్చి వుంటాడని.

నిర్లక్ష్యంగా చూచి ఓ నవ్వు నవ్వాడు.

'ఎందుకు బాబూ?'

ఉన్నట్టుండి అతని ముఖంలో మార్పు కన్పించింది. ఏదో అను మానం తలెత్తింది. 'ఏవిటిసార్? ఏమడిగారు??' అన్నాడు.

'నేనడిగేది ఒకటే ప్రశ్న బాబూ. ఎందుకు?'

అతను తన కథయావత్తూ చెప్పాడు.

''మా నాన్నగారు హెడ్మాస్టరండి. మేము చాలా మంది ఉన్నాం సంతానం. మాస్టరు ఉద్యోగం మంచిది కాదు. ఇంజనీరింగు చదివితే మంచి ఉద్యోగం వస్తుంది, డబ్బు చాలా సంపాదించవచ్చన్నారు మా నాన్నగారు,

ఇంకా చాలామంది. కాని, మీరు ఎందుకు అంటే....అవునండి ఎందుకు? ఎందుకు ఇంజనీరవ్వాలి, డబ్బెందుకు సంపాదించాలి?.... ఈ ప్రశ్న ఎవ్వరూ వెయ్యలేదు సార్."

ఆఖరుకు ప్రశ్న అలానే మిగిలిపోయింది. జవాబులేదు.

ఇదీ ఈనాటి పరిస్థితి. 'అతనెందుకు జవాబివ్వలేక పోయాడు? ఎందుకు ఆలోచనలో పడ్డాడు?' అన్న వాటికి సమాధానం ఒక్కటే. అతని మనస్సులో ఏ మూలో ఆత్మ విమర్శ మొదలైంది అంతర్గత జ్ఞాన జ్యోతి ఆత్మశోధన మొదలుపెట్టింది. అదే నిజమైన విద్య!

విద్యకు స్వామి వివేకానంద ఓ చక్కటి నిర్వచనం ఇచ్చారు.

"విద్య అనేది మానవుడిలో అణగారి ఉన్న జ్ఞానసమృద్ధికి సంపూర్ణత చేకూర్చి ప్రత్యక్షంగా ప్రస్ఫుటింప చేసేదిలా ఉండాలి. చేతనాచేతన భేదాన్ని ప్రకటింపచేసేదిలా ఉండాలి. గుణసంపదను పెంపొందించి మృగాన్నుంచి మానవుణ్ణి విడిగా నిలబెట్టేదిలా ఉండాలి. సృష్టిలో మానవుడికి ఇతర జంతుజాలానికి తేడా జ్ఞానమేకదా! దీన్ని పెంపొందించలేని విద్య అసంపూర్ణమే అవుతుంది. 'శృణ్వంతు విశ్వే అమృతస్య పుత్రాః!' అన్నాయి వేదాలు."

మరి వీటన్నింటిని సాధించేదెలా?

## ధ్యేయనిష్ఠ అవసరం

మానవుడు కొన్ని కచ్చితమైన ఆదర్శాలను ముందుంచుకుని వాటికి కట్టుబడి, వాటికోసమే బ్రతకటాన్ని ధ్యేయంగా పెట్టుకున్ననాడు, అవసరమైతే ఆ ఆదర్శాలకోసం ప్రాణాలను అర్పించటానికైనా సిద్ధపడ్డనాడు సర్వసద్గుణాలు ప్రజ్వలిస్తాయి. జీవనకుసుమం ఆదర్శాల భాస్కర కిరణా

లతో వికసించి జీవితం ధన్యమై తీరుతుంది. ఈ ఉత్తమలక్ష్య సాధనకు ఎంతో ధ్యేయనిష్ఠ, నిరంతర పరిశ్రమ అవసరం.

ఈనాడు శ్రీ రవిశంకర్ మహా విద్వాంసుడు. ప్రపంచం యావత్తు ఆయన సితార్ వాద్యలహరిలో ఉయ్యాలలూగుతుంది, ఆయనకు మోకరిల్లుతుంది. ఆయన సోదరుడు ఉదయశంకర్ నాట్యాచార్యుడు. చిన్నతనంలో వీళ్ళిద్దరు పారిస్‌పట్టణంలో వుండేవారు. యౌవ్వనకాలం,అంతులేని ఉత్సాహం, చుట్టూ విలాస జీవితం, నైట్ క్లబ్బులు, ఓహ్ ! పారిస్ జీవితం!! పాపం వీళ్ళిద్దరికి ఒక్క క్షణం తీరిక వుండేదికాదు. అన్ని సుఖాలను జుర్రుకోవాలనే ఆతృత.

ఆ దినాల్లో ఒకరోజు పారిస్‌లో మన భారత దేశపు మహావిద్వాంసుడు బడే గులాం ఆలీఖాన్‌గారి సంగీతసభ జరిగింది. రవికి మొదట్నుంచీ సంగీతం అంటే అభిమానం వుండేది. సితార్‌వాద్యం అంటే యిష్టం. అంత పెద్ద సంగీత విద్వాంసుడు, ప్రపంచ విఖ్యాతి చెందిన ఖాన్‌సాహెబ్ తాముండే నగరానికి వస్తున్నాడంటే ఊరుకోగలడా రవి. తన సోదరుడితో సహా ఆయన సభకు వెళ్ళాడు. సభ పూర్తయింది. ఖాన్‌గారి గాంధర్వ ప్రతిభకు సమ్మోహితులయ్యారు అన్నదమ్ములు. ప్రభావితులైన అన్నదమ్ము లిద్దరు ఆయన్ను స్వయంగా కలుసుకుని పాదాభివందనం చేశారు. రవికి ఆయన్ను స్వయంగా, దగ్గరగా చూచేసరికి ఎంతో ఆనందం కలిగింది. తళుక్కున ఓ ఊహ మెరిసింది. 'ఈ మహానుభావుడి దగ్గర సంగీతం నేర్చుకుంటే? !' వెంటనే అడిగాడు.

'ఖాన్‌సాబ్ ! తమరు దయచేసి నన్ను శిష్యుడిగా స్వీకరించి సంగీతం నేర్పండి' అని కోరాడు రవి.

ఖాన్‌సాహెబ్ తన ఎదురుగా నిలబడ్డ లేత కుర్రాడిని ఎగాదిగా చూచాడు. అతని దుస్తులు, తీరుచూడగానే గ్రహించాడా మేధావి.

"సరస్వతీజీకా అనుగ్రహ్ మిల్తాహై తపస్వీకో,

విలాసీకో నహీఁ!" అని జవాబిచ్చి ముందుకు సాగిపోయాడు ఖాన్‌సాహెబ్.

బడే గులాం ఆలీఖాన్ సరస్వతీదేవి ఆరాధకుడు. ఆయన దగ్గర నిలువెత్తు దేవి బొమ్మ వుండేది. తెల్లవారు ఝామున బ్రహ్మ ముహూర్తంలో చన్నీటి స్నానంచేసి ఆ దేవి ముందు కూర్చుని తన్మయత్వంతో నిరంతర సాధన చేసేవాడాతపస్వి! కుర్రాడిని చూడగానే లోపం పట్టేశాడాయన.

ఆయన అన్న ఒక్క వాక్యం పిడుగులా తాకింది రవిని. దిగ్భ్రమ చెందాడు. చుట్టూ చీకట్లు కమ్మినట్లయింది. తన సర్వస్వం పోగొట్టుకున్నట్లు కుంగిపోయాడు. తన యవ్వన జీవితాన్ని, శక్తి సామర్థ్యాలను అదుపుతప్పి ఎలా వృథా చేస్తున్నాడో తేటతెల్లమయింది రవికి. వెంటనే తేరుకుని సాగి పోతున్న ఖాన్‌సాహెబ్ ఎదుట సాష్టాంగపడి రెండు పాదాలూ చుట్టేసు కున్నాడు. పారిస్ విలాస జీవితానికి స్వస్తిచెప్పి ఆయనతోటే భారత్‌కు తిరిగి వచ్చేశాడు. తన సర్వస్వాన్నీ ఆయన పాదాల ముందు అర్పణచేసి సాధనమొదలు పెట్టాడు. సంవత్సరాల తరబడి కొనసాగింది సాధన. అహ ర్నిశలు ఓ తపస్సులా సాగింది. అల్లరిచిల్లరి రవి రూపాంతరం చెందాడు మహా విద్వాంసుడు రవిశంకర్‌గా ఈనాడు విశ్వమంతా అతని సంగీత ఝురులలో ఓలలాడి పోతున్నది. అదీ ధ్యేయనిష్ఠ! అదీ నిజమైన సాధన!! జీవితానికి సాఫల్యం.

కష్టించి పని చెయ్యటంలో గల ఆనందాన్ని అర్థంచేసుకోవాలి, స్వయంగా అనుభవించాలి చమటోడ్చి సాధించిందే అసలు విజయం. గొప్ప తనాన్ని కష్టించి, కృషితో సాధించాలి. వక్ర మార్గాల్లో కొనుక్కునే ప్రయ త్నాలు సాగుతున్నాయి ఈ రోజుల్లో.

వక్రమార్గాలు గాక రాచబాటలో ప్రయాణం చెయ్యటం అలవాటు చేసుకోవాలి. సరియైన మార్గాన్ని ఎన్నుకునే శ్రేష్ఠమైన రోజులే విద్యార్థి జీవితకాలం ఈ కాలాన్ని సద్వినియోగం చేసుకోవటంలోనే విజ్ఞతవుంది. అప్పుడే తెలిసివస్తుంది అసలు గొప్పతనం అంటే ఏమిటో దాని విలు వేమిటో. ధనం కొలబద్ద కారాదు. అధికారం ఆధారం కాదు ప్రజల దగ్గర్నుంచి మనం పొందేదానితో గొప్పతనం లభించదు. ప్రజలకు మనం ఇచ్చేదాంట్లోనుంచే ఉద్భవిస్తుంది. మనదైన ఈ సమాజసేవలోనే ఔన్నత్యం చూడగలుగుతాం.

**ఋషి ఋణం తీర్చడమంటె**

సమాజంలేందే వ్యక్తిలేడు, అతని గొప్పతనమూ లేదు. నా డిగ్రీలు నా డబ్బు, నా గొప్పతనం, నా అధికారం, నా గౌరవమర్యాదలు అనుకుంటాం. ఇవన్నీ నేను సంపాదించుకున్నాను అని గొప్పలు పోతాం. కాని ఇవి ఎలా లభించాయో ఒక్కసారి తర్కించి ఆలోచిస్తే అప్పుడు మన ముందు అసలు సత్యం నిలుస్తుంది.

డిగ్రీలు ఎలా వస్తాయి? వ్యవస్థితమైన ఎన్నో కాలేజీలు వున్నాయి. బోధించే ఆచార్యులు వున్నారు. కాలేజీలు నడిచేందుకు ఖర్చయ్యేది ప్రజా ధనమే. అంటే సమాజం తన ధనంతో నడిపే కాలేజీల్లో చదివి, సమాజం లోని వ్యక్తులైన ఆచార్యులు ఇచ్చిన శిక్షణతో ఒక వ్యక్తి డిగ్రీ సంపాదించుకుంటున్నాడు. ఇది సమాజం ఆ వ్యక్తికి ఇచ్చిన బహుమానం. ఈ విషయం ఎంతమంది గ్రహిస్తున్నారు?

డాక్టర్లు, లాయర్లు, వ్యాపారులు ఇలా ఎన్నో రంగాల వాళ్ళు సమాజంపై ఆధారపడే తమ తమ వృత్తుల్లో ప్రగతిని సాధిస్తున్నారు. ధనవంతులౌతున్నారు. కాని వాళ్ళలో కొద్దిమంది మాత్రమే ఈ విషయాన్ని

సరియైన దృక్పథంతో అవగాహన చేసుకుంటారు. 'మా గొప్పతనంతో, తెలివి తేటలతో, చాకచక్యంతో సంపాదిస్తున్నాం' అని గొప్పలు పోతారు. కేవలం అది ఒక భ్రమ మాత్రమే! మరి వీళ్ళకు సమాజంతో సంబంధం లేకపోయినట్లైతే ఏ అడవిలోనో తమ వృత్తుల్ని సాగించమనండి, తమ దుకాణాలు తెరవమనండి. ఈ డబ్బు సంపాదించగలరా? అతి సాధారణ విషయం. ఆలోచించి చూస్తే మనం తొడుక్కునే చొక్కా కూడా సమాజ పరమేశ్వరుడి ప్రసాదమే గదా!

రైతు కష్టించి భూమిని దున్ని, విత్తనాలు నాటి, మొక్కలను కంటికి రెప్పలా కాపాడి ప్రత్తిని పండిస్తాడు. ఆ ప్రత్తిని బాగుచేసి కర్మాగారాల్లోనో, చేనేత పనివారి ఇళ్ళల్లోనో దారం తయారై బట్ట నేయబడుతుంది. ఆ బట్టను దర్జీ మనకు చొక్కాగా కుడతాడు. దాన్ని షోకుషోగ్గా ధరించి 'ఇది నాచొక్కా, నేను కుట్టించుకున్నాను' అని పొంగిపోతాం. నిజమే! డబ్బు మనదే. కాని దీని వెనక శ్రమించిన సమాజం కూడా ఉంది గదా. ఆ సమాజాన్ని ఎందరం గుర్తుకు తెచ్చుకుంటున్నామో ఆలోచించండి. చొక్కాకై శ్రమించిన వాళ్ళుగాని, ఆ వ్యవస్థగాని దెబ్బతింటే మనవంటి మీదికి ఈ చొక్కా ఎలా వస్తుంది. ఈ వ్యవస్థ పటిష్టంగా ఉండేటందుకు మనమేం చెయ్యగలుగుతున్నాం?

ఇలా అన్ని విషయాల్లోనూ; ఆహారం, విహారం, బట్టలు, చదువు, వృత్తి.... ఏ అంశం తీసుకున్నా మనం ఎవరికో ఒకరికి ఋణపడి ఉంటాం. దీన్నే 'ఋషి ఋణం' అంటారు. ఈ ఋణాన్ని, ఈ విలువల్ని తెలుసుకోవటమే అసలు జ్ఞానం. ఈ ఋణాన్ని తీర్చుకోవటమే జ్ఞానానికి సాఫల్యం. సమాజాన్నుంచి పొందిందాన్ని తిరిగి సమాజానికి అందించిన నాడే ఋషిఋణం తీరుతుంది.

హిందూ ధర్మానికి ప్రమాణం ప్రకృతే! ప్రకృతిని చూచే మానవుడు అన్నీ నేర్చుకోవాలి ప్రకృతికి దూరమైన మనిషికి, నేడు కర్మాగారాల్లో తయారయ్యే మరమనిషికి (రోబట్) భేదం ఉండదు. ప్రకృతి ఏదీ తన దగ్గరే ఉంచేసుకోదు. తిరిగి అందిస్తుంది. మబ్బులు నీటిని ఉంచుకుంటాయా? వర్షరూపంలో తిరిగి భువికి నీటిని చేరుస్తాయి. ఆ నీరు నదీనదాల్లో ప్రవహించి సముద్రుడిని చేరుతుంది సముద్రుడు ఆ నీటిని తనదగ్గర ఉంచేసుకుంటున్నాడా? ఆవిరి రూపంలో తిరిగి వాతావరణానికే అందిస్తున్నాడు. మేఘాలు ఏర్పడతాయి. మళ్ళీ వర్షం. ఇలా సాగిపోతోంది ప్రకృతి ధర్మం. నీరు సముద్రుడిలో ఉండిపోయినా, మేఘాల్లో ఇరుక్కుపోయినా జీవన వ్యవస్థ ఎలా ఉంటుంది? నేటి ఆర్థిక వ్యవస్థలా!

త్యాగే నైకే అమృతత్వ మానిషః

ఈ తత్వానికి మూలం మనస్సుల్లో ప్రజానీకం పట్ల ప్రేమ. ఇది నా సమాజం అన్న ప్రేమ భావం.

ప్రతి వ్యక్తి సహజంగానే తన కుటుంబాన్ని ప్రేమిస్తాడు. తల్లి, తండ్రి-పిల్లలు, భార్య-భర్త, అన్నదమ్ములు-అక్కచెల్లెళ్ళు పరస్పరం ఎంత ప్రేమభావమో! 'నా తమ్ముడు - నా అన్న' అని చెప్తున్నప్పుడు ఆ వ్యక్తి ముఖంలో ఆనందభావం చూడాలి. బిడ్డ మంచి పేరు తెచ్చుకున్నప్పుడు, ఏదైనా ఒక ఔన్నత్యాన్ని సాధించినప్పుడు 'వీడు మా అబ్బాయండి!' అని చెప్పే తల్లి కళ్ళల్లో మెరుపు చూడాలి.

కుటుంబంలోని ఈ ప్రేమ భావంలో ప్రతిఫలాపేక్ష లేదు. ఒకరి నుంచి మరొకరు, ఏదో లాభాలను ఆశించి అభిమానించుకోరు. ఇది ప్రకృతి సహజమైన ప్రేమ. ఈ ప్రేమభావాన్నే సమాజంపై పురు మళ్ళిస్తే!? స్వామి వివేకానందలు ఉద్బోధిస్తారు.

వివేకానంద కేవలం ఒక సన్యాసి కాదు. మహా తపస్వి!

చికాగో ధర్మసమ్మేళనంలో అనర్గళంగా మాట్లాడి హిందూధర్మ ఔన్నత్యాన్ని ప్రపంచానికి చాటి చెప్పిన మహానుభావుడు. ఈ హిందూ సన్యాసికి అతి కష్టంమీద ఓ అరగంట సమయం ఇచ్చారట మట్లాడ్డానికి. అతని గంభీర ఉపన్యాసంతో ముగ్ధులై తమనుతాము మర్చిపోయారు. గంటల తరబడి సాగింది ఆయన సందేశం. ప్రభావితులైన అమెరికన్లు ఆయన్ను ఒక ప్రత్యేక విడిదిలో వుంచారు. అది ఒక మహాభవనం. ఆయనకు అన్ని ఏర్పాట్లూ చేశారు. ఇంకా ఎలా సత్కరించి తమ భక్తిని, ఆయనపట్ల ఏర్పడ్డ అనిర్వచనీయ గౌరవాన్ని ప్రకటించుకోవాలో తెలియ లేదు. ఒక ముఖ్య సేవిక (హోస్టెస్)ను కూడా ఆయన సేవల కోసం ఏర్పాటు చేశారు.

ఆనాటి రాత్రి! దిగ్విజయాన్ని సాధించిన నాటి రాత్రి. అమెరికాలో హిందూ ధర్మపతాకాన్ని సగర్వంగా ఎగురవేసినరోజు రాత్రి. హిందూ తత్వ జ్ఞాన జ్యోతిని మహోజ్వలంగా వెలిగించిననాటి రాత్రి. అనామకుడిగా అమెరికా గడ్డమీద అడుగుపెట్టి అతి ప్రఖ్యాతి నార్జించినరోజు రాత్రి. ఎంత ఆనందం! ఎంతగర్వం!

కాని, స్వామి వివేకానంద ఆరోజు రాత్రి నిద్రపోలేదు!!

నిరంతరంగా కన్నీటి ధారలు ఉప్పొంగి ఛాతీని తడిపేశాయి! దుఃఖం. ఆగని దుఃఖం. కొంతసేపు పక్కమీద వాలేవాడు. దిండు తడిసి పోయేది దుఃఖాశ్రువులతో లేచి కిటికీ దగ్గరకు నడిచివెళ్ళి పశ్చిమంవైపు దృష్టి సారించేవాడు. అలసి మళ్ళీ పక్కమీద వాలేవాడు. తీరనిదుఃఖం పొంగుకొచ్చేది. తిరిగి పక్కమీదనుంచి లేచి పశ్చిమానికి దృష్టి సారించే

వాడు. ఇలాగే భళ్ళున తెల్లవారింది. స్నానాదులు ముగించుకుని తలుపు తెరిచాడు స్వామి వివేకానంద.

ఆయన్ను చూచిన సేవిక (హోస్టెస్) నిర్విణ్ణురాలైంది. నోట మాట రాలేదు. వివేకానందముఖం అతి గంభీరంగా వుంది. కళ్ళు క్రోధాగ్నితో జ్వలించే ఫాలాక్షుడి నేత్రాల్లా రక్తవర్ణం దాల్చాయి. తేరుకుని అడిగింది సేవిక.

"స్వామీ! ఏమైంది? ఏమైనా కష్టం కలిగిందా? రాత్రి నిద్రపోలేక పోయారా? ఏమైనా ఇబ్బంది కలిగిందా? కించిత్తు సమస్యవున్నా ఫోన్‌చెయ్య లేకపోయారా?" అని అతి ఆదుర్దాతో ప్రశ్నలు వేయసాగిందా సేవిక.

స్వామి గంభీరంగా కిటికీ వైపుకు నడిచారు. అనంతంలోకి చూస్తూ మృదు మధుర గంభీరస్వరంతో ఇలా అన్నారు.

"అవును. రాత్రంతా నేను నిద్రపోలేదు. జాగరణే చేశాను. కాని శారీరక ఇబ్బందులవల్ల కాదు. రాత్రంతా పశ్చిమంవైపు, నా మాతృభూమి భారత్‌వైపు చూస్తూ ఆందోళనతో చలించిపోయాను. కన్ను మూసినా తెరిచినా నా తల్లే నాకు సాక్షాత్కారం కాసాగింది, అతి దీన వదనంతో.

మీది ఈ మధ్యనే ఏర్పడ్డదేశం. క్రొత్తది. మహా అయితే 150 సంవత్సరాలు గడిచి వుంటాయి. అంతకుమించి అమెరికాగా ఈ దేశానికి చరిత్రలేదు. కాని ఎంత అభివృద్ధి! అన్ని రంగాల్లోనూ సాధించిన ప్రగతి ఎంత ఉన్నతంగా వుంది!!

నా తల్లి భారతమాతకు ఎంత చరిత్ర వుంది. పుణ్యధాత్రి! వేల సంవత్సరాల అఖండ చరిత్రగల దేశం. తరతరాలుగా ఎంతో మంది ఋషి పుంగవులు ఉద్భవించి తమ తపో సంపదతో విశ్వానికే వెలుగందించారు ఆ నేలనుంచి. ఓనాడు విశ్వవిజ్ఞాన ప్రదాత. కాని నేడు? ఎంత

అంధకారంలో మునిగి ఉంది? ఆ మాత మానస పుత్రులు ఎంత నికృష్ట జీవితాలను గడుపుతున్నారు? ఎంత దౌర్భాగ్యం. ఎంతటి దీనత్వం!! నా సోదరులను సేవించని నా జీవితం ఎందుకు? నా గొప్పదనం దేనికోసం? నా జ్ఞాన సముపార్జనకు అర్థం ఏమిటి?? రాత్రి నా కళ్ల నుంచి ధారా పాతంగా స్రవించినవి నా కన్నీళ్ళు కాదు. కోట్లాది భారతీయుల దీన తప్త హృదయ అశ్రుజలధారలు."

ఆయన హృదయపులోతులు, ఆ ఆందోళన ఎంత మందికి ఉంది? ఎంతమంది అర్థం చేసుకోగలరు? కన్నీళ్ళు ఒక అనిర్వచనీయ స్వభావానికి, యోగ్యతకు ప్రతీకలు. తన స్వార్థంకోసం కాదాతపన. నిస్వార్థ భావ ప్రకటనతో, సమాజ శ్రేయస్సుకోసం ఉప్పెనలా పొంగి వచ్చే కన్నీరు. ప్రజానీకంపై గల ప్రేమాభిమానాల సంకేతాలు. అలాంటివి ఎన్నటికీ మామూలు కన్నీళ్ళు కానేరవు. అవి పవిత్ర గంగాజల బిందువులు!! వాటి కంత పవిత్రత వుంది.

### చదువుకోటానికి అంతెక్కడ?

వ్యక్తి ఎంత గొప్పవాడైనా కావచ్చు, ఎలాంటి అధికారమైనా ఉండొచ్చు, కాని అతని ఏకైక జీవిత ధ్యేయం దేశశ్రేయస్సు కావాలి, దేశసేవ కావాలి. జాతీయ శీలం కలిగిన వ్యక్తే మానవుడు. విద్య అనేది జీవితాంతం కొనసాగుతూనే వుంటుంది. నేర్చుకోవటానికి అంతేమిటి? ఎంతటి జ్ఞానసంపన్నుడికైనా నేర్చుకోవాల్సింది వుండనే వుంటుంది.

శ్రీరామతీర్థస్వామి తన అనుభవాన్నోసారి చెప్పాడు. ఆయన ఓడలో జపాన్ వెళ్తున్నాడు. రకరకాల వ్యక్తులు ప్రయాణం చేస్తున్నారా ఓడలో. ఏమీ తోచక ఓడంతా కలియదిరుగుతున్నాడాయన. అందరూ ఎవరిగొడవల్లో వాళ్ళున్నారు. కొందరు తాగుతున్నారు. కొందరు తింటు

న్నారు. కొందరు బాతాఖానీ కొడుతున్నారు. ఓ పిల్లగుంపు చిత్రవిచిత్ర మైన ఆటలు ఆడుతున్నారు. ఇంతలో ఆయనకో విచిత్రం కన్పించింది. అందరికీ భిన్నంగా ఓ వ్యక్తి ఒక మూల కూర్చుని చదువుకుంటున్నాడు! అతనికి దాదాపు 90 ఏళ్ళుండవచ్చు!!

ఆ వ్యక్తి దగ్గరకు నడిచివెళ్ళి పరిశీలనగా చూచాడు రామతీర్థ. జపానీ వృద్ధుడావ్యక్తి. చైనాభాష అక్షరాలు నేర్చుకుంటున్నాడు ! ! రామతీర్థస్వామికి ఆశ్చర్యమేసింది. రేపో మాపో రాలిపోయే వ్యక్తి. ఈ వయస్సులో అక్షరాలు దిద్దుకోవటమేమిటి? ఆ విషయమే ఆ వృద్ధుడిని అడిగాడు.

"తాతగారూ ! ఏమిటిది ? మీకు కంటిచూపు ఆనదు. వయోవృద్ధులు. ఈ వయస్సులో చైనా అక్షరాలు నేర్చుకోవట మేమిటి ? ఇంకా చదవాలి, నేర్చుకోవాలి అన్న జిజ్ఞాస ఎందుకు ?!"

"అవును. నేను చైనా భాష అక్షరాలు నేర్చుకుంటున్నాను."

"అదే తాతగారూ ! చైనా అక్షరాలు బొమ్మల్లా మరీ గందరగోళంగా ఉంటాయి. మీకా కళ్ళు సరిగ్గా కన్పించవు. అయినా ఇప్పుడు నేర్చుకుని ఏం చేస్తారు"?

ఆ వృద్ధుడు పుస్తకం ముడిచాడు. తలెత్తి ఓ నిట్టూర్పు విడిచాడు. సముద్రపు గాలిలో అతని పలితకేశాలు నిటారుగా ఎగురుతున్నాయి. ముఖంలో ముడతలు ప్రస్ఫుటంగా ఉన్నాయి· కళ్ళు మాత్రం జ్ఞానతృష్ణతో దీపాల్లా వెలుగుతున్నాయి.

"నేను సజీవంగా ఉన్నన్నాళ్ళు నేర్చుకుంటూనే ఉంటాను. నేర్చుకోవాలి అన్న తపనలేనినాడు నేను జీవించి ఉండటంలో అర్థం పోతుంది. చదువును ఆపివేయటం అనేది ఉండదు, దానికి అర్థం లేదు. చైనా భాషలో ఎన్నో ఉద్గ్రంథాలున్నాయి. అవన్నీ చదివి జ్ఞానసముపార్జన చేయాలన్నదే

నా ధ్యేయం" అని మళ్ళీ పుస్తకం తెరచి ఆ అక్షరాల్లో లీనమైపోయాడా వృద్ధుడు.

మన సంస్కృతి మీద ప్రేమ, కనీసం ప్రాథమిక సూత్రాలను నేర్చుకోవటం అనేవే ఈ నేలమీద పుట్టినవాళ్ళను ప్రపంచంలో ఇతరుల కంటే భిన్నంగా నిలబెడతాయి. మనం సాధారణంగా ప్రతి దినం చేసే ప్రతి పనిలో మన సంస్కృతిలోగల విశిష్టత ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. మన నడవడి, కుటుంబ వ్యవస్థ, సంసారాల్లో పరస్పర బాంధవ్యం, ఏది తీసుకుని పరిశీలించినా ప్రపంచంలోనే మనకు ప్రత్యేకత ఉంది.

మాతృదేవోభవ :

స్త్రీని మనం 'అమ్మ' అని గౌరవిస్తాం. ఒక్క తల్లినేగాదు చిన్నపిల్ల దగ్గర్నుంచి అన్ని వయస్సులవాళ్ళను 'అమ్మా!'అని పలకరిస్తాం. ఒక్క భార్యతప్ప అందరూ మనకు మాతృ మూర్తులే. తండ్రి కుమార్తెను కూడా అలానే సంబోధించటం మనం చూస్తూనే వుంటాం. స్త్రీల పేర్లు కూడా అలానే వుంటాయి. లక్ష్మమ్మ, రామమ్మ, శాంతమ్మ, ఇలా 'అమ్మ'తోనే అంత మవుతాయి. ఇది కేవలం ఏదో వ్యావహారిక విషయం కాదు. ఎంతో భావ గర్భితమైన ఆచారం. మనకు ఆవు జంతువుగాదు—గోమాత! గంగ, నది కాదు. గంగామాత. ఈ నేల మనకు భూమాత! ఇలా మాతృభావంతో చూట్టంలో కుటుంబ వాతావరణం ఏర్పట్టమేగాదు, పవిత్ర భావం మనస్సులో స్థిరపడిపోతుంది. ఎంతటి వాడికైనా తల్లి అనే మాటలోనే ప్రేమ భావం జనిస్తుంది ఎంతగొప్ప వాడైనా తల్లి దగ్గర బిడ్డే. ఎంతదుష్టుడైనా తల్లికి ద్రోహం చెయ్యడు. కుటుంబ వ్యవస్థ తల్లివల్లే సుస్థిరంగా వుంటుంది.

బీహార్‌లో రాజకీయాలకు కొరవలేదు. సంఘర్షణలు మామూలే. అన్నదమ్ములు ప్రత్యర్థులై తుపాకులతో తలపడ్డం క్రొత్తవిషయంగాదు. అలాంటి సంఘటనే జరిగిందోటి మధ్య.

స్థానిక ఎన్నికల్లో ఇద్దరు అన్నదమ్ములు ప్రత్యర్థులుగా నిలబడ్డారు. మంటరేగితే ఎగదోసే వాళ్ళకేం కొరవ. ఆ వైపు ఒకగుంపు ఇటో గుంపు తయారయ్యారు. నిత్యం కొట్లాటలు. అన్న వర్గంలో ఒక శవం లేస్తే తమ్ముడి వర్గంలో రెండు లేవాలి. దినదినానికి పరిస్థితి క్షీణిస్తోంది. వీళ్ళిద్దరి మధ్య నలిగి పోతోందో తల్లి. పెద్ద కొడుక్కి చెప్పిచూచింది. చిన్నకొడుక్కి నచ్చ చెప్ప ప్రయత్నించింది.

తగాదాలు పతాక స్థాయినందుకున్నాయి. అన్న పెద్ద సైన్యాన్ని తయారుచేశాడు. తమ్ముడి ఇంటి మీదికి దాడికై ప్రణాళిక సిద్ధమైంది. తుపాకులు, కత్తులు, బల్లేలు, అన్నీ సిద్ధమయ్యాయి. ముహూర్తం నిశ్చయ మయింది.

తల్లి మనస్సు నిలవలేదు. రంగంలోకి దూకింది. చిన్నవాడి దగ్గర కెళ్ళింది. కాళ్లావేళ్లాపడింది. కాళ్ళు పట్టుకుంటాను పంతం విడిచి తనతో రమ్మంది. నిరాహారదీక్ష బూనింది. చిన్నవాడు మెత్తబడ్డాడు. ఆమెతో ప్రయాణమయ్యాడు. కారు వచ్చి అన్న ఇంటిముందు ఆగింది. కారును దూరాన్నుంచే గుర్తుపట్టి వార్త చేరవేశారు అన్న అనుయాయులు. తుపాకీ తీసుకుని ముంగిట్లోకి వచ్చి నిలబడ్డాడు. కారు తలుపు తెరుచుకుంది. తమ్ముడు దిగుతున్నాడు. అన్న తుపాకి పైకి లేచింది. గురిపెట్టాడు తమ్ముడి గుండెకు. అప్పుడు చూచాడు అన్న తెరిచివున్న ఎడంకంటి లోంచి. తమ్ముడు చెయ్యి ఆసరా యిచ్చి దించగా కారులోంచి దిగింది తల్లి. భుజంమీద చెయ్యివేసి చిన్నగా నడిపించుకుని వస్తున్నాడు తల్లిని తన తమ్ముడు. నిద్రాహారాలు లేక నీరసించి వున్నదా వృద్ధురాలు. చిన్నవాడి నడుంచుట్టూ చెయ్యివేసి నెమ్మదిగా చిన్నపిల్లలా అడుగులువేస్తూ నడిచి వస్తున్నది తనను కన్నతల్లి. గురిపెట్టిన తుపాకి గొట్టానికి, తమ్ముడి గుండెకు మధ్యగా వుంది తల్లి తల. తాను పసితనంలో చిలిపిగా లాగిన ముంగురులు గాలికి కదులుతున్నాయి.

తల సర్దుకుంది తల్లి. తనకు పసితనంలో నోటికి అన్నం అందించిన వేళ్ళు సన్నగా వణుకుతున్నాయి. తనకు నడక నేర్పించినతల్లి ఈనాడు తమ్ముడి నడుంచుట్టూ చెయ్యివేసి ఆసరా చేసుకుని తడబడే అడుగులతో నడిచివస్తు న్నది. ఏదో భావం! గుండెలో సన్నగా గుబులు. తుపాకి జారింది! చుట్టూ కత్తులు, కటార్లు పట్టుకున్న 'సైన్యం' నిశ్చేష్టులై చూస్తున్నారు.

ఎదురుగా వచ్చి నిలబడింది తల్లి. పక్కన తమ్ముడు తలవంచుకుని నిలబడి వున్నాడు. వణికే ఆమె చేతులు మెల్లగా పైకి లేచాయి. చేతులు జోడించి అడిగింది తల్లి దీనంగా—

"నాయనా! భిక్ష అడుగుతున్నది నీ తల్లి. పుత్రభిక్ష పెట్టు." వణికే గొంతుక, ధారలు కట్టిన కన్నీరు, తనకు జన్మనిచ్చిన తల్లి శరీరం పెను గాలికి అల్లాడే ఎండు వృక్షంలావుంది. తనకై ఏనాడూ ఏమీ కోరని తల్లి. రెండు చేతులూ జోడించి....ప్రపంచం మసకబారింది అన్నకు. 'అమ్మా!' అంటూ ఆమె పాదాలమీద ఒరిగిపోయాడు. 'అన్నయ్యా!' రుద్ధకంఠంలోంచి పెకలించుకువచ్చాయి మూడక్షరాలు. 'తమ్ముడూ' అంటూ కౌగలించు కున్నాడు చిన్నవాణ్ణి.



ఒక్కక్షణం క్రితం గుండెను గురిపెట్టి కాల్చబోయాడు. మనసంతా ద్వేషంతో నిండివుండేది. 'తమ్ముడు ప్రథమ శత్రువు' అన్న భావానికి దాసుడై వున్నాడు కొద్దిసేపటి ముందు దాకా. కాని ఒక్క క్షణంలో ఎంత మార్పు! ఎలా కలిగించిందా మార్పు? కేవలం తల్లి!! ఎంత ఆశ్చర్యం!!



ఆ బలహీనమైన వ్యక్తి, వృద్ధురాలు, చావుకు సిద్ధంగా ఉన్న స్త్రీ, అంత క్రూర మనస్తత్వంతో నిండిన ఇద్దరి మనస్సులను ఎలా మార్చ గలిగింది. అదే మాతృ ప్రేమకున్న శక్తి. ప్రేమతత్వానికి ప్రత్యక్ష స్వరూపం తల్లి.

కుటుంబం సమాజానికి ఆధారం

కుటుంబ వ్యవస్థలో కేంద్రస్థానం తల్లిది. ఆమె చుట్టూ అల్లుకున్న మమతానుబంధాలతో కుటుంబం తద్వారా సమాజం సుస్థిరంగా ఉంటాయి. ఎన్ని ఇబ్బందులొచ్చినా, పొరపొచ్చాలున్నా మన సమాజంలో విడాకులు లేవు. ఈనాడు అక్కడక్కడా వినిపించే విడాకుల కేసులు విదేశీ ప్రభావంలో పడ్డ కొద్ది మంది తప్పు దోవను అనుసరించబట్టే. హిందూత్వపు చల్లటినీడలో బ్రతికేవారు, కుటుంబంలో మాతృస్థానపు ప్రాముఖ్యతను గుర్తించినవాళ్ళు ఎవ్వరూ కూడా విడాకుల విషయమై ఆలోచించనే ఆలోచించరు. పశ్చిమ దేశాల్లో విడాకులనేది సర్వసహజమైన విషయం. ఎన్నో ఏళ్ళు ఒక స్త్రీ, ఒక పురుషుడు కలిసి జీవించగలరనేది వాళ్ళు నమ్మలేని విషయం.

ఓ ప్రముఖ భారతీయ పారిశ్రామికవేత్త వ్యాపార నిమిత్తం విదేశాలకు వెళ్ళి తిరుగు ప్రయాణంలో ఉన్నాడు ఆయన పెద్దవాడు. ఫలహారాలందిస్తూ, పనిమీద అటూ ఇటూ తిరుగుతూ ఆయన్ను గమనించింది ఎయిర్ హోస్టెస్. ప్రశాంతంగా కూర్చునివున్న అతను ఆకర్షించాడామెను ఆమెకు కుతూహలం కలిగింది. పని పూర్తి చేసుకుని అతని ప్రక్కనేఉన్న ఖాళీ కుర్చీలో కూర్చుని వివరాలనడగటం మొదలెట్టింది.

'మీరు పెద్దవారు. మీ ప్రశాంతత చూస్తే నాకు చాలా ఆనందంగా ఉంది. మీకు పిల్లలెంతమంది? మీ స్వవిషయాలు అడుగుతున్నందుకు ఏమీ అనుకోరుగా' అని అడిగిందా అమ్మాయి.

'లేదు, లేదు. అనుకునేందుకేముంది. నాకు నలుగురు కొడుకులు, ముగ్గురు కూతుళ్ళు. అమ్మాయిల పెళ్ళిళ్ళు అయిపోయాయి. అబ్బాయిల్లో ముగ్గురికి పెళ్ళైంది. పెద్దవాడికి ఇద్దరు పిల్లలు, చిన్నవాడికో కొడుకు' అన్నాడాయన.

'అబ్బాయిలేం చేస్తున్నారు ? ఏఏ ఊళ్ళల్లో ఉన్నారు ?'

'పెద్దవాడు నాతోబాటే వ్యాపారం చూచుకుంటున్నాడు. రెండోవాడు సైంటిస్టు. ఉద్యోగం చేస్తున్నాడు. చిన్నవాడు డాక్టరీ చదువుతున్నాడు. ఈఏటితో అయిపోతుంది వాడికీ పెళ్ళి చెయ్యాలి' అన్నాడాయన.

'మీరు అప్పుడప్పుడూ మీ అబ్బాయిల దగ్గరకు వెళ్తుంటారా ? వాళ్ళు మీ దగ్గరకు 'విజిట్' చేస్తుంటారా ?'

'విజిట్లేమిటమ్మా. మేమంతా కలిసే ఉన్నాంగా !'

'అదేమిటి ? అందరూ కలిసే ఉన్నారా ? అదెలా సాధ్యం?! అంటే మీ కొడుకులు, వాళ్ళ భార్యలు, పిల్లలు అంటే మూడు కుటుంబాలు కలిసే ఉన్నారా !! అదెలా సాధ్యం. నాకర్థం కావటం లేదు.' అన్నదా అమ్మాయి ఆశ్చర్యంతో.

'ఇందులో ఆశ్చర్యమేముందమ్మా. మూడు కుటుంబాలేమిటి ? ఒకే కుటుంబం. కొడుకులు, కోడళ్ళు, మనవళ్ళు, మనవరాళ్ళు అంతా కలిసి ఉండటం భారతదేశంలో ప్రతి ఇంట్లో ఉండే సర్వసాధారణ విషయమే. విడిపోవటం విచిత్రంగాని కలిసి ఉండటంలో ఆశ్చర్యమేముంటుంది. పండగలకు అమ్మాయిలు, అల్లుళ్ళు వాళ్ళ పిల్లలు అంతా వస్తారు. ఇల్లు సందడిగా ఉంటుంది. అల్లుళ్ళు పిల్లలు పండగయ్యాక వెళ్ళిపోతే ఇల్లంతా బోసిపోతుంది. కొన్నాళ్ళు మాకేం తోచదు' అన్నాడాయన సర్వసహజంగా.

'కలిసివుంటే అందరూ సంతోషంగా ఉండగలరా ?' ఆ ఎయిర్ హోస్టెస్‌కు ఉత్సుకత ఎక్కువవుతోంది.

'అదేమిటి? ఎందుకు సంతోషంగా ఉండదు!?' ఈయనకు ఆశ్చర్యంగా ఉందా అమ్మాయి ప్రశ్నకు.

ఆ అమ్మాయికిదంతా ఎలా సాధ్యమో అర్థం కాలేదు. చటుక్కున మరో అనుమానం వచ్చింది. బాంబులా పేలింది మరో ప్రశ్న.

'మీరు ఆఖరుసారిగా ఎప్పుడు పెళ్ళి చేసుకున్నారు ? **(When did you marry last?)**'. పశ్చిమ దేశాల కుటుంబ వ్యవస్థ నిబిడీకృతమై ఉంది ఆ చిన్న ప్రశ్నలో.

ఈయన తలతిరిగిపోయింది. మొదట పెళ్ళి చేసుకోవటం ఆఖరు పెళ్ళి చేసుకోవట మేమిటో అర్థమై చావలేదాయనకు కాస్సేపు.

'ఇదేంప్రశ్నతల్లీ ? 40 ఏళ్లక్రితం మాపెళ్లైంది.'

ఆ అమ్మాయి కళ్లు పెద్దవిగా విచ్చుకున్నాయి. దిగ్భ్రమతో నోరు తెరుచుకుంది.

'అంటే 40 ఏళ్లనుంచి మీరు ఒకే భార్యతో, ఆమె ఒకే భర్తతో కలిసి జీవిస్తున్నారా !!!' ఆమె ఆశ్చర్యమంతా గొంతులో తొణికిసలాడింది. అదామెకు సుతరామూ నమ్మలేని విషయం.

ఆయనకు కొంచం కోపం వచ్చింది. పెళ్లంటే ఏమిటీ అమ్మాయి ఉద్దేశ్యం. ఆమెనో సారి తేరిపార చూచాడు అందులో కొంటెతనంగాని మరే దురుద్దేశ్యంగాని కన్పించలేదు. అమాయకంగా అడుగుతోందా అమ్మాయి.

అవును మాపెళ్ళి 40 ఏళ్లక్రితం అయింది మేమిద్దరం బ్రతికున్నంతకాలం కలిసేవుంటాం. ఇందులో విడ్డూరమేమిటి? ఎందుకంత ఆశ్చర్యపోతావు. ఇది మాదేశంలో సర్వసామాన్య విషయమే. భార్యాభర్తల అనుబంధమంటే నీ ఉద్దేశ్యమేమిటి ? జీవితాలు ఒకసారి ముడిపడ్డాక కష్టాలు, సుఖాలు అన్నీ చనిపోయేదాకా సమంగా పంచుకుంటాం, సమస్యలను కలిసి తీర్చుకుంటాం. శారీరక సుఖం సంసారంలో ఒక చిన్న

భాగం మాత్రమే. [illegible] కలిసి (mating season) విడిపోతూ వుండటానికి మేమేం జంతువులమా! అన్నాడాయన కొంచం కటువుగా.

కళ్లింత చేసుకుని ఆయనవైపో క్షణం తేరిపార చూచింది.

'మేము.... మేం....' ఎక్కడో బావిలోంచి మాట్లాడినట్లు రెండు ముక్కలొచ్చాయి ఆమె గొంతులోంచి. వెంటనే ఆమె వలవలా ఏడవటం మొదలుపెట్టింది. రెండుచేతులూ ముఖాన పెట్టుకుని భోరున రోదించింది.

పాపం ఈయనకు విపరీతంగా కంగారుపుట్టింది. చుట్టుప్రక్కల వాళ్లు ఏమనుకుంటారో అని కలియచూశాడు. ఆపాటికే విమానంలోని కొందరు వీళ్లవైపు ప్రశ్నార్థకంగా చూస్తున్నారు. కొంత తేరుకుని ఎయిర్ హోస్టెస్ తలమీద చెయ్యివేసి నిమురుతూ మృదువుగా అడిగాడాయన. జవాబులేదు.

'నేనేమన్నా తప్పుగా అన్నానా తల్లీ? కటువుగా మాట్లాడి వున్నా, తప్పుగా మాట్లాడి వున్నా నన్ను క్షమించు' అన్నాడాయన నెమ్మదిగా.

ఆ అమ్మాయి పరిస్థితి గ్రహించింది. నెమ్మదిగా తేరుకుని కళ్ళు తుడుచుకుని తల అడ్డంగా తిప్పుతూ 'మీ తప్పేమిటి?....తప్పమాది' అని కాస్త ఆగి మళ్ళీ ఇలా అన్నదామె.

'మీ కుటుంబ వ్యవస్థ ఎంత అద్భుతమైంది! పెళ్ళయ్యాక భార్య, భర్త, సంసారం, పిల్లలు ఎంత చక్కటి వాతావరణం! మా బ్రతుకులూ వున్నై, మృగాలం మేము. మాకు శారీరక సుఖాలే ముఖ్యం. కామతృష్ణే ప్రధానం మరో భావం, మరో బంధం మాసమాజం మాకెందుకు చెప్పదు? నాకు రెండు పెళ్లిళ్లయ్యాయి విడిపోయాం. పిల్లలు మావిలాసాలకు అడ్డం. వాళ్లను ప్రభుత్వానికి వదిలేశాం. (social security వ్యవస

ప్రకారం) వాళ్లకు మా మీద ప్రేమలేదు. ఎలావుండగలదు? మేము వాళ్లెలా బ్రతుకుతున్నారో, ఎలా వుంటారో కూడా మర్చిపోతాం. మొక్కుబడికి సంవత్సరానికోసారి వెళ్ళి కొన్ని బహుమానాలిచ్చివస్తాం. అంతే, బాధ్యత తీరిపోతుంది. నెలకింత అని వాళ్లకు కేటాయిస్తాం. ప్రస్తుతం నేను మరోవ్యక్తి కలిసి వుంటున్నాం. అతను నా భర్త కాదు. ఛీ! నన్ను చూచుకుంటే నాకే అసహ్యమేస్తోంది, అని తేరిపార తన శరీరాన్ని చూచుకుని లేచివెళ్ళిపోయిందామె.

మన భారతీయుడి మనస్సంతా చీకాకయింది. ఆమె మీద చాలా జాలి వేసింది.

అయిదునిమిషాల్లో తిరిగి వచ్చిందా ఎయిర్ హోస్టెస్. మళ్లీ అదే కుర్చీలో కూర్చుంది. అమె ముఖం ప్రశాంతంగావుంది. ముఖం కడుక్కొని అలంకరించుకున్నట్లు స్పష్టంగా తెలుస్తున్నది. ఏదో నిశ్చయం ఆమె ముఖంలో కొట్టొచ్చినట్టు కన్పిస్తున్నది ప్రశాంతంగా అన్నదామె.

'మీతో మాట్లాడిన కొద్దిక్షణాల్లో నాకోపరమసత్యం తెలియవచ్చింది. మీ దేశ కుటుంబవ్యవస్థ చాలాగొప్పది. అసలైన మానవత్వం అదే. మేము స్వార్థంతో మృగాల్లా ప్రవర్తిస్తున్నాం మా కసలు పటిష్టమైన కుటుంబ వ్యవస్థే లేదు. ఇంత చక్కటి సంస్కారం గల దేశంలో పుట్టిన మీ స్త్రీలు ఎంత అదృష్టవంతులు? నాకు నా కర్తవ్యం స్పష్టంగా తెలిసింది. నేను తిరిగి స్వదేశం వెళ్ళగానే చెయ్యబోయే మొదటిపని పిల్లల్ని ఇంటికి తెచ్చుకోవటమే. వాళ్ళకు మామూలు కుసంస్కారం అంటనివ్వను. చక్కటి వాతావరణంలో పెంచి కామతృష్ణకతీతమైన సంస్కారం నేర్పుతాను. ఈ విడాకుల వాతావరణాన్ని అసలు దగ్గరకు రానివ్వని మనఃప్రవృత్తిని నేర్పుతాను నాకీ జ్ఞానాన్ని కలిగించిన మీకు సర్వదా కృతజ్ఞురాలిని మీ

దేశంలో ఇలా రెండు చేతులూ కలిపి అభినందిస్తారనుకుంటాను' అని రెండు చేతులూ జోడించి నమస్కరించిందామె.

ఏ దేశంలో పుట్టినా, ఏ వాతావరణంలో పెరిగినా తల్లి మనసు తల్లి మనసే. ప్రశాంతతతో, నిశ్చయ మనస్సుతో వెలిగిపోయే ఆమె ముఖాన్ని సంతోషంగా చూస్తూ ఉండిపోయారు మన పారిశ్రామికవేత్త.

ఎంతో ఉన్నతమైన సంస్కారాలు, ఆదర్శాలు మన సమాజంలో సర్వసహజంగా ఎలా వ్యవస్థితమై ఉన్నాయో ఆలోచిస్తే ఆశ్చర్యమేస్తుంది. ఎంత దూరాలోచనతో చేసిన ఏర్పాట్లవి. ఇంత లోతుగా ఆలోచించిన మన ఋషి మునులెంత మేధావులో!

చిన్న పిల్లలప్పట్నుంచీ, అప్పుడప్పుడే మాటలు వచ్చేవాళ్ళచేత పలికిస్తుంటాం; 'మాతృదేవోభవ, పితృదేవోభవ!' అని. చిన్నతనాన్నుంచే ఈ గుణసంపదను పెంచే సంస్కృతి మనది. వయస్సుతో బాటే పెరిగే సంస్కారమే మనచేత ఉన్నతంగా ఆలోచింపచేయ గలుగుతుంది. అందుకే మనం అనగలుగుతున్నాం మనసారా.

'ఏకం సత్ విప్రాః బహుధావదంతి' అని.

మానవుడు పెరిగేకొద్దీ అనుభవం పెరుగుతుంది సామాజిక వ్యవస్థ, మొత్తం మానవజాతి ఎలా ఉన్నతంగా ఉండాలో తెలియజేస్తాయి మన అమృతవాక్కులు. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు. ప్రజా ప్రభుత్వ వ్యవస్థ సర్వసహజంగానే మన హిందూ ధర్మంలో నిల్చి ఉన్నాయి. కలిసి ఆలోచించటాన్ని ఎలా అలవాటు చేసుకుంటామో, వ్యతిరేక వాదాల్ని కూడా అలాగే సహృదయంతో ఆమోదిస్తాం. 'ఒకే దేముడు. మరోడిని తలిస్తే నరికేస్తాం!' అనే సిద్ధాంతం కాదు మనది. 'ఒకే ప్రవక్త, ఒకే మత

గ్రంథం, ఒకే మతం. మరో దాని మాట ఎత్తితే గొంతుమీద కత్తే! అన్ని మతాలూ ధ్వంసమై మాదే నిలవాలి!' ఇలాంటి సంకుచిత సిద్ధాంతాలు లేవు మనకు.

'సర్వే జనాః సుఖినో భవంతు'

"లోకాస్సమస్తాః సుఖినోభవంతు." దేశం బలమైనదైతే బలహీనమైన దేశాన్ని కరుకు పాదాలక్రింద నలిపేయాలనే సిద్ధాంతంకాదు మనది. ఇతరులపై దండయాత్రలు, ఆక్రమణలు మనధ్యేయం కాదు అనాదినుంచి మన ధర్మాధికారులు దిగంతానకు హిందూధర్మాన్ని వ్యాపింపచేయటానికి ప్రయాణాలు చేశారు. ఓ చేతిలో కత్తితో వెళ్ళలేదు వాళ్ళు. అర్థ దిగంబరులైన సన్యాసులు. కాని విజ్ఞానఖనులు. స్వలాభాపేక్ష లేకుండా కేవలం ధర్మ సంస్థాపనకోసం వెళ్లారు. తమకు తెలిసిన విజ్ఞానాన్ని తాము పొందిన సంస్కారాన్ని పదిమందికీ పంచటానికే నాలుగు చెరగులా వెళ్లారు. కుటిలతతో, కుతంత్రంతో రాజకీయపు ఎత్తులతో వెళ్ళలేదు. ఇద్దరు వ్యక్తుల మధ్యగాని, రెండు రాజ్యాల మధ్యగాని పొరపొచ్చాలుంటే మధ్య మరికొంత అగ్నిని రగిల్చి ఇంకా విడదీయాలని గాని, ఆ రాజ్యాలను తామాక్రమించాలని గాని దురుద్దేశాలు కొనసాగించలేదు. వాళ్లమధ్య పరిస్థితుల్ని స్వాంతన పరచటానికే కృషిచేశారు.

ఈ మధ్య ఓ తత్వవేత్త వ్రాశారు. 'హిందూ ధర్మంవల్ల, హిందూ దేశంవల్ల చైనీయుల జీవితం ఎంతో ప్రభావితమైంది' అని. హిందూ ధర్మంలోని భాగమైన బౌద్ధం ఆదేశంలో ఈనాటికీ నెలకొని ఉంది. రాజకీయంగా కమ్యూనిజం ఉండొచ్చు.

మన ధర్మాచార్యులు ఏ ప్రజమధ్యకు వెళ్ళినా మతాంతరీకరణలు చేసే ప్రయత్నమే చేయలేదు వాళ్లకు ఆధ్యాత్మిక చింతన తెలియజేసి

వారి సనాతన జీవనసరళిని మెరుగుపరిచారేగాని అల్లకల్లోలాలు సృష్టించ లేదు.

హిందూధర్మానికి, గాంధీ సినిమాకి లంకెఏమిటో సాధారణంగా మనం ఊహించలేం. కాని అమెరికాలో జరిగిన ఓ విచిత్ర సంఘటన తెలియవచ్చింది. ఓ అమెరికన్ జంట గాంధీ సినిమా చూచారు. చాలా ప్రభావితులయ్యారు. హిందూ వేదాంతమే గాంధీ జీవితానికి మూలం అని గ్రహించారు. వాళ్ళు క్రైస్తవులు. కాని హిందూ ధర్మంగురించి తెలుసు కోవాలని ప్రామాణిక గ్రంధాలను చదవాలని చాలా ఆతృత చెందారు. వివరాలు వివరించి ఉపనిషత్తులు, భగవద్గీత చదివారు. వారు స్వయంగా చెప్పిన విషయం వింటే ఆశ్చర్యమేస్తుంది. చదివింది హిందూ ధర్మ శాస్త్రాలు. కాని పొందిన సంస్కారం వాళ్ళ మాటల్లో ఇలా వుంది.

'మేము ఉపనిషత్తులు, భగవద్గీత, వ్యాఖ్యానాలు ఇలాంటి హిందూ శాస్త్రాలు చదివాం. చాలా ప్రభావితులమయ్యాం. ఈ గ్రంధాలు చదివాక క్రైస్తవ మతం మాకు చాలా విస్తృతంగా అర్థమైంది. మేమిప్పుడు మంచి క్రైస్తవులమయ్యాం!!!'

చూడండి, చదివింది హిందూ ధర్మంగురించి, కాని మంచి క్రైస్తవుల మయ్యాం అంటున్నారు. మన ధర్మం ఎంత నిగూఢమైందో, ఎంతటి విజ్ఞాన సమృద్ధితో అలరారుతోందో, విశ్వవ్యాప్తంగా ప్రభావితం చెయ్యగలదో మనం ఊహించుకోవచ్చు.

కమ్యూనిస్టులు క్షుణ్ణంగా మన ధర్మశాస్త్రాలు చదివితే మంచి మార్క్సిస్టులు కావచ్చు. ఈనాడు రష్యా దేశంలో వాళ్ళ రష్యాన్ భాషలోకి మన రామాయణ భారతాలు, భగవద్గీత, ఉపనిషత్తులు తర్జుమా చేసుకుంటు

న్నారు. నిరంతరం గంగా ప్రవంతిలా ప్రశాంతంగా సాగిపోయే మన సామాజిక జీవన స్రవంతి ఏ ప్రాతిపదికమీద సుస్థిరంగా వుండగలుగుతోందో అర్థమై చావటంలేదు అందరికీ. 'వీళ్ల గ్రంథాల్లోనే వుంది అసలు బిస!' అని వాటి అధ్యయనం మొదలుపెట్టారు అన్ని దేశాల వాళ్ళు.

ఐశ్వర్యంతో తులతూగుతున్నా, కోటి సుఖాలు గుమ్మందగ్గరున్నా మానసికంగా అశాంతితో అలమటిస్తున్న వేలాది అమెరికన్లు మన ధర్మంలో సేదదీర్చుకుంటున్నారు. కృష్ణ భక్తులు (Iskcon) పిలక గుండుతో, కాషాయధోవతులు కట్టి, త్రిపుండ్రాలతో, రుద్రాక్షలతో భజనలు చేస్తూ వాషింగ్టన్, న్యూయార్కు వీధుల్లో తిరగటం ఎవరైనా ఊహించే దృశ్యమేనా! కాని ఇదీ నేడు ఆదర్శితమవుతున్న నిత్యసత్యం.

మనకీనాడు మనవైన శాస్త్రాల అధ్యయనం లేదు, వాటి పరిజ్ఞానం లేదు. కాని అవితాకని విజ్ఞానపు అంచులు లేవు. ఏనాడో మన వేదాల్లో, ఉపనిషత్తుల్లో నిర్వచించిన విషయాలకు కేవలం భౌతిక స్వరూపాన్నిచ్చి పరిశోధనల ద్వారా నిరూపించుకుంటున్నారు ఈనాటి శాస్త్రజ్ఞులు.

ఈ చరాచర జగత్తులో స్థావర జంగమాది సర్వంలో ప్రాణముందని నిర్వచనం చేశారు మన ఋషులు. మొక్కలకు ప్రాణముందని నిరూపించి నోబెల్ బహుమతి పుచ్చుకున్నాడు జగదీశ్‌చంద్రబోస్. తనకు సన్మానం చేసిన 'రాయల్ సొసైటీ' వారు ఏర్పాటుచేసిన సభలో మాట్లాడుతూ,

"నేను మొక్కలకు ప్రాణం వుందని కనుక్కున్నాను. అందుకే నాకీ సన్మానం. కాని అది నేను కనుక్కున్న కొత్త విషయమేంకాదు. ఎన్నో వేల సంవత్సరాలక్రితమే తపోధనులైన మా ఋషులు చెప్పిన సత్యమే ఇది. కేవలం నేను కొన్ని యంత్రాలద్వారా దీన్ని నిరూపించాను,

